జనవరి 1959
ప్రథమ ముద్రణ
వెయ్యిప్రతులు

కవితా
ప్రచురణ
నెం. 14

మినర్వా ప్రెస్
బందరు

వెల 75 న. పై.

సంపాదకులు

నెప్పల్లె త్రివిక్రమరావు



విడియాల చంద్రశేఖరరావు
19/378 బచ్చుపేట
మచిలీపట్నం.

# అంకితం

కళాతపస్వి



ఉత్తమనటుడు _ దర్శకుడు

అయిన

డాక్టరు జి. రాజారావుగారికి

గౌరవపురస్సరంగా

—— రచయిత

బందరు జీవితభీమా ఉద్యోగుల క్లబ్ ప్రథమ వార్షికోత్సవ సందర్భమున కృష్ణాజిల్లా కలెక్టరుగారైన శ్రీ గంగోపాధ్యాయగారి అధ్యక్షతను శ్రీయుతులు జె. మాతన్, భాస్కర్ల గోపాలకృష్ణమూర్తి, ఐ. బ్రహ్మానందరావు, తోలేటి రామారావు, విడిమూల బసవరాజు, వై. నారాయణరావుగార్ల సమక్షమున ప్రథమంగా ప్రదర్శింపబడినది.

## నాటి నటవర్గము

రామ్మూర్తి:- ప్రభల లక్ష్మీనరసింహం

నరహరి:- ఐ. వి. కోనేశ్వరశాస్త్రి
(1958 రాజమండ్రి లలితకళానికేతన్ వారి నాటకపోటీలలో ఉత్తమ నటుడు)

శివరాం:- కె. శ్రీరామకృష్ణారావు

కుర్రవాడు:- చి॥ పిడుగు రాంబాబు

పద్మ:- శ్రీమతి వాణీబాల
(1958 రాజమండ్రి లలితకళానికేతన్ వారి నాటకపోటీలలో ఉత్తమనటి)

దర్శకత్వం:- సనకా గోవిందరావు

నిర్వహణ:- సి. యస్. నారాయణ
(1958 రాజమండ్రి లలితకళానికేతన్ వారి ప్రత్యేక నాటికలో ఉత్తమనటుడు)

స్టేజీ - రంగాలంకరణ:- నటశ్రీ, లిథో కృష్ణమూర్తి

సమర్పణ:- ఫైన్ ఆర్ట్సు అసోసియేషన్ ఆఫ్ ఇన్సూరెన్సు కార్పొరేషన్ ఎంప్లాయీస్ క్లబ్, మచిలీపట్నం.

# నా మాట

బందరు జీవితభీమా ఉద్యోగుల క్లబ్ కార్యదర్శియైన శ్రీ రంగావఝుల రామమూర్తి, వారిమిత్రులైన శ్రీయుతులు యం. అశ్వద్ధామ, జి శివరాం, సిహెచ్. యల్. పి. వి. రంగా రావుగారలు వారు జరుపుతున్న క్లబ్ వార్షికోత్సవ సందర్భములో మధ్యతరగతి గుమాస్తా ఎక్కువమంది పిల్లలతో తక్కువ జీతంతో పడుచున్న బాధలను వ్యక్తపరుస్తూ నాటికను వ్రాయ వలసినదిగా నన్ను ప్రోత్సహించిరి. వారిచ్చిన ప్రోత్సాహము వలన ఉత్సాహముతో యీ నాటికను వ్రాశాను. నాకీ అవకాశమును కల్పించిన పై మిత్రులకు నాకృతజ్ఞత.

ఈ నాటిక రచనకు ఉత్తమమైన సలహాలు, సహకారాలు అందించిన బందరు జీవితభీమా ఉద్యోగులకు, శ్రీయుతులు బి. వాయునందనరావు, మిరియాల రాఘవయ్యనాయుడు, శ్రీవణం గామమోహనరావు, కూరాళ్ళ రామచంద్రరావు, మహమ్మద్ శిరాజుద్దీన్ గారలకు నా హృదయపూర్వక అభివందనములు.

నా సందేహాలను సమాధానపరచిన శ్రీయుతులు గోవాడ నిరీక్షణరావు, ప్రఖ్య శ్రీరామమూర్తి, శ్రీనివాస చక్రవర్తి, జి. కోటి కుమారస్వామి, శ్రీమతి కొప్పరపు సరోజనీగార్లకు నా కృతజ్ఞత తెలుపుకొనుచున్నాను.

ఈ నాటికను "ఫైన్ ఆర్ట్సు అసోసియేషన్ ఆఫ్ లైఫ్ ఇన్సూరెన్సు కార్పొరేషన్ ఎంప్లాయీస్ క్లబ్ వారు ప్రదర్శించు

నపుడు దీనికి దర్శకత్వం వహించిన శ్రీ ననకా గోవిందరావుగారికి, ప్రతిఫలం ఆశించకుండా నటించి ఈ నాటికకు వన్నె తెచ్చిన శ్రీమతి వాణీబాలగారికి, ఇందు పాల్గొనిన నటవర్గమునకు నా నమోవాకాలు.

కోరినంతనే పరిచయ వాక్యాలు వ్రాసియిచ్చిన ప్రముఖ సినిమా రచయితలైన శ్రీ రావూరు వెంకట సత్యనారాయణరావుగారికి సర్వదా కృతజ్ఞుడను.

ఇప్పటివరకు నా రచనపట్ల ఆదరాభిమానాలను చూపెడుతున్న ఆంధ్రప్రజలు ఈ నాటికను కూడా ఆదరిస్తారని ఆశిస్తున్నాను. తమకు తోచిన సలహాలు, సహాకారాలు అందిస్తారని విశ్వసిస్తున్నాను.

విడియాల చంద్రశేఖరరావు.



# నాకు తోచింది

రచయిత శ్రీ విడియాల చంద్రశేఖరరావు నాటకాను భవంతలవాడు. నాటక రంగాన్ని పవిత్ర దేవాలయంగా భావించుకోగల శక్తిగలవాడు. ఆశక్తిలో చాలా శక్తులుంటాయి. అనుభవంలో విరివైన భావాలు వున్నాయి. కనుక ఈ రచయిత కలంతీసుకొని నవలలు, నాటికలు వ్రాయడానికి ఉపక్రమించారు. నవల సంగతి అలావుంచి ఈ "త్రిశంకు స్వర్గం" నాటికను నేను చూచాను.

రామ్మూర్తి ఆయనభార్య పద్మ ఇందులో ముఖ్య పాత్రలు, ఆదిలో నాటికసమస్య......అధిక సంతానం, బస్తీలో కాపురం, చిన్నఉద్యోగం, తక్కువజీతం తత్ఫలితమైన తాప త్రియం. తర్వాత కథావస్తువు ఆర్థికదుస్థితి మీదకు అట్టే వ్రాలింది. చివరకు ఆడవాళ్లుకూడా సంపాదిస్తేనేగాని సంసారాలు చన్నీళ్ళకు వేన్నీళ్లు పాళంకావు అనే భావాన్ని బలపరచాడు రచయిత.

నాటక లక్షణాల కంటే నాటిక లక్షణాలు కొంచెం క్లిష్టమైనవి. తగినంత కొద్దికాలంలో కథావస్తువును ముగించాలి. క్లైమాక్సు తీసుకురావాలి. అన్నింటికి మించినది రంగస్థలంలో చైతన్యం కల్పించాలి. ఆ దృష్ట్యాకూడా రచయిత శ్రద్ధ తీసుకున్నారు. మొత్తం కథ భార్య భర్తల మీదే పడటం వల్ల కొంచెం నిలిచినట్లు కనిపిస్తుంది. ఆ నిలకడకు తగినంత చలనం సంభాషణల్లో వుంది. రచయితలో సునిశితమైన హాస్యం,

పద గుంభనా వున్నాయి. నాటకం వ్రాయడానికి పూనుకుంటే మంచిపాత్రలను సృష్టించి తగినవ్యవధి, అవధి కల్పించుకోగలరని నానమ్మిక. ఎంతకొట్టుకున్నా, ఎంతసంపాదించుకున్నా సాంఘిక జీవనరీత్యా మధ్యతరగతి జీవితాలు స్వర్గాలేగాక యీశీర్షికకు తగినట్లుగావుంది. రచన దృష్ట్యా ఆలోచించిన అట్లు నవల కాకుండా, యిటు నాటకం కాకుండా నాటిక "త్రిశంకుస్వర్గం" గానే నిలిచి పోతుంది. కాని, త్రిశంకుస్వర్గ స్థితిలోనే కొంత డ్రామావుంటుంది గనుక రచయిత ప్రయత్నం సఫలమవడానికి అవకాశాలున్నాయి. శ్రీ చంద్రశేఖరరావు అటు రంగానుభవం, యిటు రచనానుభవం విరివిగా అలవరచుకొని విశిష్టములైన రచనలకోసం తమ కలాన్ని, కాలాన్ని ఉపయోగిస్తారని ఆశిస్తున్నా.

రావూరు వెంకట సత్యనారాయణరావు,
(సినిమారచయిత)



# త్రిశంకు స్వర్గం

## (నాటిక)

(రామ్మూర్తి - 30 సం॥లు, పద్మ - 25 సం॥లు, శివరాం - 30 సం॥లు, నరహరి - 40 సం॥లు, కుర్రవాడు - 7 సం॥లు)

రంగాలంకరణ:- ఒక హాలు, హాలుమధ్య ఒక టేబులు, రెండు కుర్చీలు, ఒకమూల పాతగుడ్డల దండెము, గోడకు గాంధీ, జవహరులాల్ ఫొటోలు, గోడకు ఒక పట్టిమంచము ఆనించి వుంటుంది ఆమంచం ప్రక్కనే వకచాప చుట్టి పడివుంటుంది. (మధ్యతరగతి కుటుంబము) ఉదయం పదిగంటలవేళ

(రామ్మూర్తి పేపరు చదువుకుంటూ కుర్చీలో కూర్చుంటాడు)

రామ్మూర్తి:- (తనలో) కాశ్మీరు సమస్య - కవిసన్మానం - నక్కబొక్కలపాడులో అగ్నిప్రమాదం - రైలు ప్రమాదంలో య్యేభైమంది మృతి - ఇండియాలో అధికసంతానోత్పత్తి. (పేపరు టేబులుమీదకు గిరాటుకొట్టి) అనుకున్నంతా అయ్యింది. నేను చెప్పితే వింటేగా. పద్మా! ఓపద్మా! ఓసారి యిలారా! లోపల ఏంచేస్తున్నావ్ ? త్వరగారా!

పద్మ:- అబ్బ! వస్తున్నానండీ! ఏమిటాపొలికేకలు?

రామ్మూర్తి:- నేను పిలుస్తుంటే పొలికేకలా! నువ్వు తగులబెట్టే రాచకార్యం ఏమిటీలోపల ?

పద్మ:- (వస్తూ) వచ్చేలోగానే అంతచిరాకు పడతారేం! రాచ కార్యంకన్నా పెద్దకార్యమే. పాపకు పాలుపడుతున్నా.

రామ్మూర్తి:- చూశావా! ఈ పేపర్లో ఏం వ్రాశారో. కొంప ముంచినంతపని చేశావ్. నువ్వు చేసిన యీ పాడుపని మన నాయకులకు తెలిస్తే నిన్నేంచేస్తారో తెలుసా?

పద్మ:- నేనేంచేశానండీ! మీరు కంగారుపడి నన్ను కంగారు పెడుతున్నారే. ఏమిటీ మాయదారి రభస.

రామ్మూర్తి:- ఆ నంగనాచికబుర్లే వద్దన్నా. ఇప్పుడు నీవు రాజ ద్రోహివి.

పద్మ:- ఆఁ...

రామ్మూర్తి:- ఆఁ...ఏమిటి. దేశద్రోహివి కూడానూ.

పద్మ:- ఇదేంఖర్మమండీ! నేనేం కొంపలుకూల్చానా, కన్నాలు వేశానా, ఎవరిద్రవ్యమైనా దోచుకున్నానా! ఎందుకలా ఆడిపోసుకుంటారు.

రామ్మూర్తి:- వాటినన్నింటిని మించినపని చేశావ్. నీవుచేసిన తప్పుకు దేవుడుకూడా క్షమించడు. పద్మా! ఆఖరికి ఆ కాకులు కూడా కరుణించవంటే నమ్ము.

పద్మ:- ఎందుకొచ్చిన గొడవండీ! అదేమిటో తేల్చిచెప్ప కూడదూ! నన్ను వేధించకపోతే.

రామ్మూర్తి:- అదే సస్పెన్సు. గట్టిగా మాట్లాడకుమరీ! పరువు పోతుంది. నీవు చేసిన యీ దేశారిష్టంపనులకు.

పద్మ:- నేనేం అప్రదిష్టపనులు చేశానోచెప్పండి నన్నుచంపక.

రామ్మూర్తి:- ఇంకా అదేమాట. నువ్వు, నేను దాచిన ఆ ప్రకృతి దాస్తుందా?

పద్మ:- అవతల పిల్ల ఏడుస్తోంది. త్వరగా చెప్పండి మీకుపుణ్యం వుంటుంది.

రామ్మూర్తి:- అదే. ఆ పిల్లలసంఖ్య అంకెల్లో పెరిగిపోతోంది. ఈ సంగతి తెలిసే ఈరోజుపేపర్లో వ్రాశారు. సంతానాన్ని నిరోధించమని.

పద్మ:- నాగుఱించి ఆ పత్రికలవాళ్లకు ఏంతెలుసునండీ! అయినా, ఆ పాడుపత్రికలు చదివే అలవాటు నాకులేదు.

రామ్మూర్తి:- నోర్ముయ్యి. లోకజ్ఞానం కలిగించే పత్రికలు పాడువా? అమూల్యములైన అభిభాషణలు మనకు అందించే పత్రికలు పాడువా.

పద్మ:- కాదు కాదు. ఆ చెత్తపత్రికలన్నీ భగవద్గీతలు. సరేనా.

రామ్మూర్తి:- భగవద్గీతలకన్నా ఎక్కువే ఉపయోగపడుతున్నాయి. నీలాంటి తెలివితక్కువ దద్దమ్మలకు నోట్లో యింతగడ్డి పెడుతున్నాయ్.

పద్మ:- అబ్బ బ్బ బ్బా! ఇంతకూ నేనేంచేశానండీ! మీకు పుణ్యంవుంటుంది త్వరగాచెప్పండి.

రామ్మూర్తి:- అభిజ్ఞుల ఆజ్ఞను జవదాటి దేశాపచారం చేశావ్.

పద్మ:- (విసుగ్గా) ఏమిటా మహాపచారం.

రామ్మూర్తి:- నానోట చెప్పించాలని చూస్తున్నావా ?

పద్మ:- ఇవాళ మీకు మతిపోయిందాఏమిటండీ?

రామ్మూర్తి:- పోయింది. మరి ఏనాడో పోయింది. పోయిందని యిప్పుడు తెలిసింది. దేశ కాలపరిస్థితులను కళ్లారా చూస్తూ, పత్రికలు చదువుతూ నేనుకూడా యిలాంటి అనర్థకాలకు తోడవుతానని తెలుసుకోలేకపోయాను.

పద్మ:- అనర్థకంలేదు-ఆచారంలేదు. కాస్తనిమ్మకాయపులుసుతో తలంటు పోస్తానుగాని పదండి.

రామ్మూర్తి:- నేను చెప్పేదంతా తమాషా అనుకున్నావా? నీ ప్రోగ్రెస్ తగలెయ్య. మనం బ్రతకడమే కష్టంగావుంటే ఈ వయస్సుకి నీకు నలుగురు పిల్లలా! నలుగురు. జీతం పెరగటంలో నాకు ప్రోగ్రెస్ లేకపోయినా సంవత్సరం తిరుగకమునుపే నీకు కాన్పు ఆదాయాన్నిబట్టి పిల్లల్ని కంటూ వుండాలి.

పద్మ:- అవ్వ. దీనికాయింత రాద్ధాంతం. ఎవరన్నా వింటే నవ్విపోతారు. ఊరుకోండి.

రామ్మూర్తి:- కాదేంమరీ! నిజంగా మనబ్రతుకు నవ్వులపాలు చేశావ్. జనాభివృద్ధిని అరికట్టమని దేశానికి సహాయ పడమని పత్రికలు అదేపనిగా ఘోషిస్తున్నాయ్. మరిమనం......

పద్మ:- ఏం. ఆ పత్రికలవాళ్ల ఖజానాలలోనుంచి డబ్బు మన క్షేమైనాయిచ్చి పోషిస్తున్నారా? కని, పెంచే మనకులేని యీ కష్టం ఆ పత్రికలవాళ్ల కెందుకండీ? ప్రకృతిమీద ప్రభుత్వంవారిని ఒక యాక్టు పెట్టమనకూడదూ?

రామ్మూర్తి:- తప్పు తప్పు. మనలో చైతన్యంకలిగి ప్రభుత్వానికి మనం సహకరించి, ప్రభుత్వ సందేశాలను మనం శిరసా వహించిననాడే దేశానికి ముక్తి పద్మా! దేశానికిముక్తి. పదిమందిని కని, వారిజీవితాలు పాడుచేసేకన్నా కొద్ది మందినేకని, వారిని అభ్యుదయవాదులను చేస్తే ఎంత బావుంటుందిచెప్పు.

పద్మ:- అయితే నన్నిప్పుడు ఏంచేయమన్నారు ?

రామ్మూర్తి:- నీ ఒక్కదానివల్ల ఏమవుతుంది. ఏమన్నా చేయాలనుకుంటేమాత్రం. ఇద్దరంకలసి దేవుడికి మొక్కుకుందాం. ఇకనైనా సంతానాన్ని అరికట్టమని, సంతాన ప్రవాహానికి ఆనకట్ట వేయమని. (గొంతుక సవరించు కొంటూ) నీతో వాగి వాగి నాపీక ఆర్చుకుపోయింది. కాసిని కాఫీనీళ్ళైనా యివ్వు.

పద్మ:- పాలదానికి డబ్బు యివ్వలేదని ఈరోజు అది పాలుపోయలేదు. కాఫీపొడి కొంచెంగా వుంది. కాస్త పంచదార వుంటే నిన్న పిల్లలు తినేశారు.

రామ్మూర్తి:- (విసుగ్గా) తినేశారూ! ఇంకా రెండురోజులుపోతే నిన్నూ - నన్నూకూడా పీక్కుతింటారు. కరువుకి పుట్టారే వీళ్ళంతా కరువుకి. కాసిని మంచినీళ్ళైనా తగులబెట్టు.

పద్మ:- ఈరోజు యింతవరకు పంపుల్లో నీళ్లురాలేదండీ!

రామ్మూర్తి:- (పీక సవరించుకుంటూ) అబ్బా! నేను దాహంతో చస్తూవుంటే చావుకబురు ఎంత చక్కగాచెప్పావ్ గొంతుక ఆర్చుకుపోతుంటే ఎలాచచ్చేది నీతో.

పద్మ:- ఎందుకండీ నామీద అలా కసురుకుంటారు. పంపుల్లో నీళ్లు రాకపోయినా నామీదేనా కోపం. వెళ్ళి ఆమ్యునిసిపాలిటీవారిని అడగండి.

రామ్మూర్తి:- పోనీ కాసిని నిన్నటినీళ్లైనా తగులబెట్టు.

పద్మ:- ఆ నీళ్లతో పిల్లలకు వళ్లుకడిగానండీ

రామ్మూర్తి:- (కోపంగా) ఏడవలేకపోయావ్. నారాతకొద్ది దొరికావ్ (పోబోతాడు)

పద్మ:- ఏమిటండీ! అలా వెళ్ళిపోతున్నారు. ఈపూట ఎసర్లోకి బియ్యంలేవు కాసేపుంటే పిల్లలు ఆకలికి ఏడుస్తారు.

రామ్మూర్తి:- నువ్వు అడిలిచచ్చినా నాదగ్గర చిల్లిగవ్వలేదు. పుట్టినచోటల్లా, అందినచోటల్లా అప్పులు తీసుకొచ్చాను. ఇక నావల్లకాదు. అన్నం వండకపోతే పస్తులుపడి చావండి. (నిరాశగా) ఇక నా నిత్యజీవితంలో సుఖంలేదు.

పద్మ:- అదేమిటండీ అలాఅంటారు. ఇప్పటివరకు నవ్వుతూ మాట్లాడి ఇంతలోనే అంత ఆవేశంగా మాట్లాడుతున్నారేమిటి ?

రామ్మూర్తి:- అవును. ఏంచావను. ఆలోచనతక్కువ ఆవేశం ఎక్కువ. అప్పులవాళ్ళకు సమాధానం చెప్పుకోలేనంత నిస్సహాయకుడనైపోయాను. నిద్ర లేచినదిమొదలు పడుకోబోయేదాకా ఏ కోణంలోనుంచి చూచినా అప్పులవాళ్ళే కన్పిస్తున్నారు. రాబందులు చచ్చినవాళ్ళనే పీక్కుతింటాయి. కాని, ఈఅప్పులవాళ్లు. బ్రతికున్నవాళ్ళను నిలువునా చీల్చి మరీతింటారు (నిరాశగా) పగలంతా యంత్రంలాగా పనిచేసినా రాత్రంతా నిద్రలేకుండా ఆర్థిక

సమస్యలు అడ్డుకుంటున్నాయి. నాజీవితాన్ని ప్రశ్నించి ఉమ్మేసినట్లు విధి వికటంగా నవ్వుతోంది పద్మా.

పద్మ:- ఎందుకండీ అలాబాధపడతారు మనదేశంలో ఈ విధంగా బాధపడేది మీరొక్కరేకాదు. చాలీ చాలని జీతాలతో ఎక్కువమంది పిల్లలతో,పిల్లలకు చదువులు చెప్పించలేక వారిభవిష్యత్ జీవితాలనుకూడా పాడుచేస్తూ మీలాగే ఎంతోమంది బాధపడుతున్నారు. ఈబాధలను గ్రహించేగా మీయజమానులు సిబ్బందికి జీతాలు పెంచుతానంటున్నారు. జీతాలు పెరిగితే మన జీవితాలలోని బాధలన్నీ తొలగిపోతాయ్.

రామ్మూర్తి:- తొలగిపోతాయ్. ఏంతొలిగిపోతాయో పద్మా! ఇన్నాళ్లనుంచీ ఆజీతాలకోసమే ఎదురుచూస్తున్నా. మన ఆశలు ముందుకుపోతే జీతాలు వెనక్కుపోతున్నాయ్. అందుకోసనే ప్రతిరోజు ఉదయం పేపరు కొని ఆదుర్దాగా పరకాయించి చూస్తున్నా ఏంలాభం. ఎంతసేపూ ఆపేపర్లో కాశ్మీరుసమస్య - ఆత్మహత్యలు- రైలుప్రమాదాలు - కవిసన్మానాలు - మంత్రులకు నివేదికలేగాని మా జీతాల ప్రసక్తి ఏమూలా ఉండదు.

పద్మ:- ఏమోనండీ! ఆ కొత్తజీతాలు వచ్చినా అప్పులు తీరతాయని, మన సంసారం సక్రమంగా సాగుతుందని నాకు నమ్మకంలేదు. ఆడబ్బు నిలవాలి - మరి.

రామ్మూర్తి:- అవేంమాటలు పద్మా! నేనేం తాగుబోతునను కున్నావా?

పద్మ:- ......అని నేనన్నానా. త్రాగుబోతు ఒక్క త్రాగుడికే డబ్బుపాడుచేస్తాడు. మీబోటివారికి పేకాట - క్లబ్బులు - సినిమాలు - సిలుకుచొక్కాలు కావాలి. వచ్చేడబ్బంతా వీటికే వినియోగిస్తే మనసంసారం ఎలాగా అని......

రామ్మూర్తి:- (నవ్వుతాడు)

పద్మ - ఎందుకలా నవ్వుతారు?

రామ్మూర్తి:- నీ పిచ్చిగానీ క్లబ్ లకు వెళ్ళేవారంతా పేకాడే వాళ్ళేనా! క్లబ్ అంటే ఒక్క పేకాటనేకాదు. అందులో మానసికంగా - వ్యాయామకంగా అన్ని ఆటలకు అవకాశాలున్నాయి. ఒకరో యిద్దరో ఊసుబోక కాసేపు పేకాడుకుంటే అందరూ నీలాగానే ఆడిపోసుకుంటారు

పద్మ:- ఏమోలెండి మీమగాళ్ళను నమ్మేదెవరు? ఇంట్లోచెప్పేది ఒకటి. బయటచేసేది మరొకటి. ఏదైనా అప్పుకోసం పొరిగింటికెడితే 'నీకేవమ్మా! ఉద్యోగస్తుని భార్యవు' అంటారు. వాళకేంతెలుసు మనం పడుతున్న బాధలు (ఘనంగా) అయినా, ఉద్యోగులకు విలువ అలాగే వుంటుందండీ!

రామ్మూర్తి:- అవును: అలాగేవుంటుంది. వాళ్లతో చెప్పలేక పోయావా? మాబోటి ఉద్యోగస్తులసంగతి.

పద్మ:- ఏమని ?

రామ్మూర్తి:- ఉంటానికి సముద్రములోనే వున్నాం. కాని, త్రాగడానికి మాత్రం నీళ్లులేవని

పద్మ:- మీ పై యజమానులే మీకష్టాలు గుర్తించనప్పుడు వాళ్లు తీరుస్తారుటండీ మనకష్టాలు మీదంతా పిచ్చిగాని. ఈ కష్టాలు కలకాలం మనకుండేవేగాని ఈపూటకు బియ్యం ఎక్కడైనా తీసుకురండి. ఇంట్లో వంటసామాను ఒక్కటీలేదు. అన్నిడబ్బాలు ఖాళీ అయిపోయాయి. ఈపూట మీరు వంటసామాను తేవాలి, నేను వంట చేయాలి.

రామ్మూర్తి:- (విసుగ్గా) నావల్లకాదు. వంట చేయకపోతే మీరంతా అన్నమో రామచంద్రా అని అడిలిచావండి. శని విరగడై పోతుంది.

పద్మ:- అంత పెట్టలేనివారు నన్నెందుకు చేసుకున్నారు? పెద్ద సంబాధాలకు కట్నం యివ్వలేక ఈ ఊబిలో పడేశాడు మానాన్న. పెళ్లై పదేళ్లయింది. ఇంతవరకు ఒక చీర కొన్నారూ? నాకే పుట్టింటి ఆశ లేకపోతే నాగతి ఏంగానూ? (ఏడుస్తుంది)

రామ్మూర్తి:- ఏడుస్తున్నావా! ఏడ్వు. బాగాఏడ్వు. ఈ ఏడ్పు కొంపలో నేను ఉండలేను. నేనుపోతాను. ఏసన్యాసుల్లోనైనా కలుస్తాను. ఈ సంసారం నేను చెయ్యలేను. నీతో అసలు వేగలేను. ఏముందే ఈ కొంపలో. నాకెదురుగా నువ్వు, నీకెదురుగా నేను. మన యిద్దరి ఏడ్పుముఖాలు చూస్తూ ఆ పిల్లలు.

పద్మ:- మీరెందుకండీ పోవడం. నేనేపోతాను. గంగలోపడి చస్తాను. పీడ విరగడై పోతుంది. మీపిల్లలు మీరు హాయిగావుండండి.

రామ్మూర్తి:- చస్తావా. చావు. సుఖంగాచావు. ఆఁ చస్తేచచ్చావు గాని గంగలోపడిమాత్రం చావకు. యిరవై రూపాయలు రైలుచార్జి అవుతుంది. నామాటవిని కృష్ణానదిలోపడి చావు. రెండురూపాయలతో సరిపోతుంది.

పద్మ:- అవున్లెండి నేను ఎప్పుడుచస్తానా అని మీరు కూర్చున్నారు. బ్రతికించలేనివాళ్లు చచ్చేందుకు సలహాలు బాగానే చెబుతారు.

రామ్మూర్తి:- బ్రతికించలేనప్పుడు సలహాలైనా చెప్పాలిగామరి?

పద్మ:- మీరు పోషించలేనప్పుడు నేనుమాత్రం యిక్కడెందుకు? పోతాను. మా పుట్టింటికి పోతాను. మన సంసారానికి సరిపడుజీతం మీకొచ్చినప్పుడే వస్తాను. ఈ చాలీ చాలని జీతంతో నేను చెయ్యలేను ఈ సంసారం.

రామ్మూర్తి:- పోతావా! మీ పుట్టింటికి పోతావా! భార్యను పోషించలేక వెళ్ళగొట్టాననేపేరు నాకుతెస్తావా! చూడు పద్మా! ఈ పరిస్థితుల్లో నన్నొంటిగాచేసి వెడ్తావా? ఏదో బాధలో అన్నదానికి యింత కోపమైతే ఎలా చెప్పు. నేనేంచావను! ఆదాయం కుక్కగొడుగుఎత్తునుంటే - ఖర్చు గాలిగోపురాన్నంటుకుంది.

పద్మ:- మరి మీరేగా వెళ్ళమన్నారు.

రామ్మూర్తి:- అవును. అన్నాను. అన్నంతమాత్రాన వెళ్ళడమేనా! సుఖంలో భర్తగాని కష్టాల్లో భర్తకాడా? ఇదేనా దాంపత్యం? అవును పోషించలేని వాడికి పిల్లలెందుకు? భార్యఎందుకు? పోండి. మీరంతా వెళ్లిపోండి. నేనూపోతాను. శాశ్వతంగాపోతాను. ఈ ప్రపంచాన్నే

విడిచి వెళ్ళిపోతాను. ఈ పాడు సంసారంకన్నా పర లోకమే హాయి. పోతాను. నేనూ పోతాను.

పద్మ:- అబ్బా! ఏమిటండీ! ఈ ఆవేశం. నేను వెళ్ళనులెండి. మిమ్ములను విడిచి నేనుమాత్రం ఎక్కడకు వెడ్తాను చెప్పండి. డబ్బులేని ఆవేశంలో నన్ను మీరు అర్థం చేసుకోలేకపోతున్నారు.

రామ్మూర్తి:- పద్మా! (దగ్గరకు తీసుకుంటాడు)

పద్మా:- ఆఁ!

రామ్మూర్తి:- అలకలూ, కులుకులూ మనకు మామూలేగా! మన దాంపత్యం ఎప్పుడూ.........

(బయటనుంచి గట్టిగా 'రామ్మూర్తిగారు' అనే కేక వినబడుతుంది)

రామ్మూర్తి:- (కంగారుగా పద్మనువదలి) పద్మా! వడ్డీవ్యాపారి నరహరివచ్చాడనుకుంటాను. ఇంట్లోలేరు ఆఫీసుకెళ్ళారని చెప్పు. వాడికి కనిపించానంటే నాప్రాణం తీస్తాడు. ఊఁ! వెళ్లు. (రామ్మూర్తి వంటయింట్లోకి వెళ్ళి దాక్కుంటాడు)

నరహరి:- ఏమండీ! రామ్మూర్తిగారు వున్నారా?

పద్మ:- ఎవరండి మీరు? (వీధితలుపు తీస్తుంది)

నరహరి:- (ఇంట్లో ప్రవేశించి) నేను వడ్డీవ్యాపారి నరహరిని. రామ్మూర్తిగారు ఇంట్లోలేరమ్మా!

పద్మ:- లేరండీ. ఇప్పుడే ఆఫీసుకెళ్ళారు.

నరహరి:- అవును ఎందుకుంటారు. అప్పు కావలిసివచ్చినప్పుడు ఒకటికి పదిసార్లు మా యింటిచుట్టూ తిరిగారు. ఆయన

అవుసరం తీరిపోయిందిగా. ఇక నేను తిరగలేక చస్తున్నా. ఆయిన అప్పు యిచ్చేదో ఎగేసేదోగాని ముందు నాచావు కొచ్చింది.

పద్మ:- ఇంతకు ఏపనిమీద వచ్చారో చెప్పండి. వారు రాగానే చెపుతాను.

నరహరి:- వడ్డీవ్యాపారి మీయింటికి ఎందుకొస్తాడు ? ఇబ్బందిగా వుందని నాదగ్గర నోటు వ్రాసి అప్పు తీసుకున్నారు. ఆరు మాసాలు దాటిపోయింది. అదేమిటంటే జీతాలు పెరిగాక యిస్తానంటాడు. ఆయన జీతం పెరిగినట్లే నా కిచ్చినట్లే. అసలుసంగతి ఎలావున్నా వడ్డీకూడా ముట్టలేదంటే నమ్మండి. వడ్డీకొక దణ్ణంగాని నా అసలు నాకు పారవేయమని చెప్పండి. ఇలాంటోళ్లందరికి అప్పులు యివ్వబట్టే మా బ్రతుకులు ఇలాతగులబడ్డాయి.

పద్మ:- బ్రతుకులుదాకా ఎందుకండి. త్వరలోనే మీ బాకీ యిప్పించేస్తాను.

నరహరి:- ఇదుగో చూడమ్మా ! రేపుగనుక నాబాకీ యివ్వక పోతే బజారులో నిలబెట్టి అల్లరిచేస్తాను. నాసంగతి తెలియదుగాబోలు. నరహరంటే నిజంగా నరహరే. వస్తానమ్మా. గట్టిగా మందలించండి. (లేచిపోబోతూ) వడ్డీవ్యాపారంటే ప్రతివాడికి యింతచులకన అయి పోయింది. మాకొచ్చేవడ్డీలు వీళ్ల కొంపలుచుట్టూ తిరగడానికి చాలదు. అదేమిటంటే పాపిష్టి సంపాద నంటారు ప్రతివాళ్లూ.

కుఱ్ఱవాడు :- (కండ్లు నలుపుకుంటూ ప్రవేశించి) అమ్మా ! నాన్నని బడిజీతం అడిగితేనూ నాదగ్గర డబ్బులేదు బడి మానేమన్నాడే.

నరహరి:- (హఠాత్తుగా) అయితే యింట్లోనే వున్నాడన్నమాట. ఎందుకమ్మా యిన్ని అబద్ధాలు, ఇంట్లోవుండే లేడని పించాడే ఎన్నాళ్లు దాక్కుంటాడో నేనూ చూస్తాను.

పద్మ:- ఛీ వెధవ ! ఏమిటిరా నీగోల (కుఱ్ఱవానిని చెంపపెట్టుపెట్టి) నీ అల్లరి ఎక్కువై పోతోంది.

కుఱ్ఱవాడు:- (ఏడుస్తుంటాడు)

పద్మ:- ఎందుకురా ఏడుస్తావ్. (వీపుమీదకొడుతూ) నోరు ముయ్యి. ముయ్యవేరా! కరువుకి పుట్టార్రా మీరంతా. నా ప్రాణానికి యమదూతలయ్యార్రా మీరంతా. నోరు మూస్తావామూయవా ? (వీపుమీద కొడుతుంది)

నరహరి:- ఎందుకమ్మా కుఱ్ఱవాడిని కొట్టుకుంటావ్. మీదంతా బలేనాటకంగావుందే.

పద్మ:- నా బిడ్డని కొట్టుకుంటాను. చంపుకుంటాను. నీకెందు కయ్యా.

నరహరి:- నా డబ్బు నాకిచ్చి మీ బిడ్డను మీరుచంపుకోండి.

పద్మ:- (కుఱ్ఱవాడిని కొట్టబోతుంది)

కుఱ్ఱాడు:- (ఏడుస్తుంటాడు)

రామమూర్తి:- (కంగారుగా ప్రవేశించి) ఛీ ! పశువా ! నీకుహృదయంలేదటే, కన్నకడుపుకాదటే. ఎందుకలా కొట్టుకుంటావ్. ఒక్కసారిగా చంపేరాదు. (కుఱ్ఱవానిని ఎత్తుకొని) నాబోటి గర్భదరిద్రునియింట ఎందుకుపుట్టావ్

తండ్రీ! నీ తండ్రి యిప్పుడు ఏమీచేయలేని నిస్సహాయుడు
నైనాడు. నీకు కడుపునిండా తిండిలేకపోయినా దెబ్బలతో
చచ్చిపోతున్నావా తండ్రీ! ఎన్నాళ్లోనాయనా మన
కీబాధ.

పద్మ:- (కుర్రివాడిని తీసుకొని యింట్లోకివెళ్తుంది)

నరహరి:- ఏమయ్యా! ఇంట్లో వుండే లేడనిపించావే?

రామ్మూర్తి:- చాల్లేవయ్యా! ఇప్పుడు నిన్నెవరు రమ్మన్నారు! నెల ఆఖరురోజుల్లో డబ్బు గుట్టపోసుకొని కూర్చున్నా మనుకున్నావా?

నరహరి:- ఇప్పటినుంచి తిరిగితేనేగాని ఆ జీతాలనాటికి తగుల బెట్టవని.

రామ్మూర్తి:- నిన్ను డబ్బుతోనే తగులబెట్టాలయ్యా. లేకపోతే తగులబడవు.

నరహరి:- నన్ను తగులబెడుదువుగాని డబ్బు తీసుకురావయ్యా.

రామ్మూర్తి:- ఆ డబ్బేవుంటే నా ఖర్మకాలి నీ దగ్గర అప్పు ఎందుకు తీసుకుంటానయ్యా.

నరహరి:- చిల్లికాని గతిలేదు. ఆ నోరుకొవ్వెన మాటలెందుకు?

రామ్మూర్తి:- ఏమిటి కూస్తున్నావ్. నోరుకొవ్వెందా?

నరహరి:- అవును. ఉన్నమాటే అన్నాను. అన్నచోటే వున్నాను.

రామ్మూర్తి:- ముందు యిక్కడనుంచి పోతావా పోవా.

నరహరి:- నాకీవ్వవలసింది లెక్కచూచి పారేయవయ్యా! పోతాను. నాకేమి ఇల్లు వాకిలి పెళ్ళాం బిడ్డలు లేక మీయింటికి వచ్చాననుకొన్నావా?

రామ్మూర్తి:- పెళ్ళాం బిడ్డలు వున్నవాడవైతే కష్టసుఖాలు తెలిస్తే యీవిధంగా యింటిమీదపడి పశువులాగా ప్రవర్తిస్తావా ?

నరహరి:- ఏమయ్యో ! మాటలు సరిగ్గారాని.

రామ్మూర్తి:- లేకపోతే ఏంచేస్తావయ్యా. అసలు నీ వల్ల ఏమవుతుంది?

నరహరి:- నోటికి బుద్ధిచెప్పిస్తా. నీకు పుట్టగతులు లేకుండాచేస్తా. నరహరి అంటే నరసింహావతారమే.

రామ్మూర్తి:- భయపడేవాడికి నీ బెదరింపులుగాని నిండా మునిగినవాడిని నాకు భయమేమిటయ్యా !

నరహరి:- నీ పని చెపుతా తొందరపడకు. పొంగిందల్లా పొయ్యిపాలే.

రామ్మూర్తి:- పిచ్చిగా వాగావంటే దేహశుద్ధిచేస్తా.

నరహరి:- కొడుదువుగాని. నిన్ను కోర్టుకు ఈడ్పించి నీ కొంప జప్తుచేయిస్తా. బజారులో నిలబెట్టి గోలచేస్తా. నీకు పుట్టగతులు లేకుండాచేస్తా. నరహరి అంటే నిజంగా నరసింహావతారమే.

రామ్మూర్తి:- నీ కివ్వవలసిన బాకి కోర్టులోనే యిస్తా. నాకు మరీసుఖం. నెలకు కాస్త చొప్పున కట్టుకుంటా. అదీగాక రూపాయికి బేడ వడ్డీసంగతికూడా కోర్టులోనే తేలుస్తా. మాబోటి పేదకుటుంబీకుల రక్తాన్ని పిండి పిప్పిచేసి నీదాహం తీర్చుకుంటున్నావని నిరూపిస్తా.

నరహరి:- ఏమిటోయ్ నువ్వుచేసేది.

రామ్మూర్తి:- తొందరపడకు, నువ్వు న్యాయంగా ప్రవర్తిస్తే మేమున్యాయంగానే నీ డబ్బు నీకు యిచ్చేస్తాం. నీదగ్గర అప్పుతీసుకున్నప్పటినుంచి ఎన్నివందలు నీకు వడ్డీక్రింద కట్టానో చెప్పు. ఒక్కనెల ఆలశ్యమైతే యింటిమీదకు వచ్చి నలుగురు వినేలాగా పెళ్ళాం బిడ్డల్ని అల్లరి చేస్తావా? ఇది నీకుధర్మమేనా! అయినా నిన్ననేపనేం ముందీ! కడుపు కక్కుర్తికోసం, క్షుద్బాధ ఆపుకోలేక నీదగ్గర అప్పు తీసుకోవలసి వచ్చింది. ఇంకెంతకాలమో మాకీదురవస్థ కడుపునిండా తిండీ, వంటినిండా బట్ట, తలదాచుకోడానికి యిల్లు ఏర్పడేదాకా మా బోటి ఉద్యోగులకు ఈ లాంటి బాధలు తప్పవు.

నరహరి:- ఈ మాటలకేమొచ్చె. నీ ఉపన్యాసం వింటానికి రాలేదు. నన్ను ఎలాగో మాయబుచ్చాలని చూస్తున్నావుగాబోలు నరహరంటే నరసింహావతారమే. నీ మాయ మాటలకు లోబడేవాడినికాదు.

రామ్మూర్తి:- ఇప్పుడు నీబాకీ యివ్వనంటే నువ్వుచేసేదేమిటి? కోర్టుకు వెళ్తావ్. అంతేనా. ఊఁ... కానీ...

నరహరి:- ఇదుగో మర్యాదగా చెప్తున్నా. నా డబ్బు నాకు పారెయ్యి. లేకపోతే నిన్నేంచేస్తానో చూడు.

రామ్మూర్తి:- తొందరపడకు. నీ పాపం పండింది.

నరహరి:- పండింది రాలటానికే. నీ పళ్లురాలిపోతాయి.

రామ్మూర్తి:- (కోపంతో మీదకువెళ్ళి) నీ వీపు చిట్లకొడతా నువ్వు పోతావా పోవా.

నరహరి:- (కొంచెందడుస్తూ) నీకు బుద్ధి చెప్పిస్తా! నిన్ను కోర్టుకు ఈడ్పిస్తా నరహారం టే నిజంగా నరసింహావతారమే.

పద్మ:- (ఆదుర్దాగా ప్రవేశించి) ఎందుకండీ యీ పోట్లాట. నెలాఖరికి మీడబ్బు యిచ్చేస్తామంటే ఎందుకీగొడవ. మా బ్రతుకు నవ్వులపాలు చెయ్యాలనా! చూడండి. అటుచూడండి. ఇరుగు పొరుగువాళ్లు హేళనగా ఎలానవ్వుతున్నారో. ఎదుటవాళ్లు యిబ్బందిగావున్నా రంటే, సహాయం చేయవలసిందిపోయి నవ్వుతున్నారు యిరుగుపొరుగువాళ్లు. పేద సంసారమంటె ఈసమాజానికి ఎంత హేళన. తామేదో గొప్పగా బ్రతుకుతున్నట్లు.

నరహరి:- నా బాకీ తీరేదాకా నేను యిలా గోలచేసేదేనిజం.

పద్మ:- మా సంసారాన్ని అల్లరిపాలుచేస్తే నీకు ఒరిగేదేమిటి? నవ్వులపాలుచేస్తే నీకు వచ్చేదేమిటి? పోనీ, మా బ్రతుకు అల్లరిచేసి నేలరాచి మమ్ములను వదలిపెడతావా? నీబాకీ వదులుకుంటావా? చూడండి! మీరు ఎలా యిచ్చారో ఆలాగే మీబాకి రద్దుచేస్తాం. నామాట వినండి. ఏదో మావారు ఉద్యోగం చేస్తున్నారని పేరేగాని నిరుపేదవాళ్లం. (నరహరిచేతులు పుచ్చుకొని) బ్రతిమలాడుకుంటున్నాను. నేను నీ కూతురననుకో. నీ కూతురు బ్రతుకు అల్లగయితే నీవు సహించగలవా? నా ముఖంచూచి మమ్ములను యీసారికి వదిలేయండి. జీతంరాగానే సరాసరి మీ యింటికే పంపిస్తాను. జీతం అంతా మీకే కట్టిస్తాను. నెలంతా పస్తులు పడివుంటాం. నామాట నమ్మండి.

నరహరి:- నీ బుద్ధి ఆయనకుందేమో చూడమ్మా. మీద మీదకు వచ్చి ఎలా కొట్టబోతున్నాడో. వట్టి పొగరు బోతులాగా కన్పిస్తున్నాడు.

రామ్మూర్తి:- నువ్వులేవు యమదూతలాగా. పగలుచూస్తే రాత్రి కలలోకొస్తావ్. నీ చూపు, రూపు చూస్తే మాకు రేపు మాపు జ్వరం వచ్చేటట్లుంది.

పద్మ:- అబ్బా! ఊరుకోండి. మీరు మరీనూ.

నరహరి:- అందుకే యింట్లోవ్వుడి లేడనిపించావు.

రామ్మూర్తి:. నాపరిస్థితుల్లో నువ్వు వుంటే పాతాళంలో దాక్కునేవాడివి. నీ డబ్బుని నేను, నా పేదరికాన్ని నువ్వు పంచుకొని చూద్దాం. అప్పుడు అర్థమవుతుంది పేదవాళ్ల బాధ.

నరహరి:- గొప్పవాళ్లంతా పేదవాళ్లై నీలాగా బ్రతకాలనా నీ కోరిక.

రామ్మూర్తి:- కాదు కాదు రూపాయికి బేడలు వడ్డీ చొప్పున అప్పులిచ్చి డబ్బు సంపాయిద్దామని భగవంతుడు మీకు డబ్బేయిచ్చాడు. మీబోటివారికి హృదయం ఎక్కడిది.

నరహరి:- హృదయం ఉండబట్టే దయదలచి నువ్వు రాగానే అప్పు యిచ్చాను.

రామ్మూర్తి:- రూపాయకు బేడ వడ్డీకు. అసలుకు రెండింతలువేసి నోటు వ్రాయించి. పాపం! ఎంతదయానిధివి.

పద్మ:- ఇష్టమై తీసుకున్న తరువాత యివ్వక తప్పుతుందా ఎంతవడ్డీ యైనా. ఇచ్చేది కలిగివుండి ఎందుకండీ అతనితో పోట్లాట, అర్థంలేనిమాటలూనూ. (నరహరిని ఉద్దేసించి)

ఎందుకొచ్చిన గొడవండి యీ నెలాఖరికి మీబాకీ యిచ్చేస్తాంగాని యిక మీరు వెళ్ళండి.

నరహరి:- అదీ చూస్తాగా. ఇదుగో అమ్మాయి! నీ మాటవిని, నీ ముఖంచూచి వెళ్తున్నా. ఈ నెలాఖరికి నాబాకీ యివ్వకపోతే మీ ఆయనను కోర్టుకు యీడుస్తా. నరహరంటె నిజంగా నరసింహావతారమే ఊఁ...... జాగ్రత్త. (వెళ్ళిపోతాడు)

రామ్మూర్తి:- ఇబ్బందులు పడలేక ప్రాణాలన్నా తీసుకోవచ్చు గాని యీఅప్పులు మాత్రం చేయకూడదురా భగవంతుడా.

పద్మ:- అంత ఆత్మాభిమానం గలవాళ్లు అప్పు ఎందుకు చేశారట. అయినా ఆడబ్బు ఏంచేసినట్లు మనయిల్లు బజారయిపోయింది. ప్రతివాళ్లు యింటికిరావడం అప్పడగటం. నిన్నమట్టుకు నిన్న చాకలిది, పాలది, వెచ్చాల కొట్టువాడు, ఇంటి యజమాని ఒక్కసారిగా మనయింటి మీదకు దండెత్తారు ఏదో నాముఖంచూసి ఏమీ అనలేక దయదలచి వెళ్ళిపోయారు. ఈ నెల పెద్దవాడికి బడిజీతం కట్టలేదు బడినుంచి పేరు తీసివేశారట. జీతం యిస్తేనేగాని బడికి వెళ్ళవని వాడు హుకుం జారీచేశాడు. ఎదిగే ఆడపిల్ల నగా నట్రా లేకపోయినా దానికి వంటినిండా ఒక గానుకూడా లేదు. మూడోవాడికి ఎంత సేపు తిండికంధి వాడు ఏడుస్తుంటే ఓదార్చటానికి చేతిలో చిల్లికానీకూడా లేదు. నయాపైస చేతికిస్తే వద్దని అవతల పారవేస్తాడు వెధవ. వాడికి పెద్దకానీ

కావాలట. చంటిదానికి పాలడబ్బా అయిపోయింది. మీరు విసుక్కుంటారని నేను ఆ ప్రస్థాపన మీదగ్గరకు తేవడంలేదు. ఎలాగండీ! యిలాఅయితే.

రామ్మూర్తి:- అవును పద్మా! మనబ్రతుకు భారంగా నే వుంది. ఏబాధనైనా పడవచ్చుకాని, అప్పులబాధమాత్రం పడలేం. ఎద్దుపుండు కాకికి ముద్దు. అయినప్పటికి రోటిలో తలదూర్చి రోకలిపోటుకు వెరవడం ఎందుకు? ఆర్థికబలం లేనివాడి బ్రతుకు చిల్లి కానీకికూడా చెల్లదు. మనకు మంచిరోజులు త్వరలోనే వస్తాయి పద్మా! అంతవరకు కాలం మనలను కప్పిపుచ్చుతుంది.

పద్మ:- కాలం. కాలం కాదండీ మనలను కప్పిపుచ్చేది డబ్బు. డబ్బు కప్పిపుచ్చాలి.

రామ్మూర్తి:- అవును పద్మా! నిజంగా అంతే. డబ్బే మనలను కప్పిపుచ్చాలి. మనజీవితాలు హాయిగా కొనసాగాలంటే డబ్బు కావాలి. డబ్బులేనివాడిని యీ లోకం ఆడిస్తుంది. డబ్బు వున్నవాడు యీ లోకాన్నే ఆడిస్తాడు. డబ్బు వున్నవాడికి లేనివాడంటే హేళన. లేనివాడికి వున్న వాడంటె అసూయ. మానవునిలో మానవత్వం ఏనాడో నశించిపోయింది. లేకపోతే, మానవుడు తనవంటి ఎదుట మానవునిపట్ల క్రూరమృగమై ఎందుకు సంచరిస్తాడు. ఈ సమాజంలో మానవుడు సుఖం పొందినా, కష్టం అనుభవించినా మానవునివల్లే. ఉన్నవాడు బాధ పడుతున్నాడు. లేనివాడు బాధ పడుతున్నాడు. లక్షాధి కారి మరోలక్ష కూడబెట్టుటకు బాధపడుతున్నాడు.

సామాన్యుడు యీ పూట తింటే మరోపూటకు గ్రాసం వెదుక్కోడానికి బాధ పడుతున్నాడు. మానవునిలో స్వార్ధం బాగా జీర్ణించుకుపోయింది. అవును. స్వార్ధంలేని బ్రతుకులో సారమేముంది? తన స్వార్ధంకోసం ఎదుట వానిని బాధిస్తేనేగాని వాడు రాణించడు లేకపోతే చూడు పద్మా! ఇంటిఅద్దె వచ్చేనెలదికూడా అడ్వాన్సు చెయ్యమంటాడు యింటి యజమాని. మెడికల్ ఫీజు అంతా చెల్లించమంటాడు డాక్టరు. ఫీజు ముందుగా చెల్లించకపోతే కోర్టుకు రానంటాడు ప్లీడరు. కాగితాలు కదులుటలేదు సంజాయిషీ అడుగుతానంటాడు ఆఫీసు అధికారి. ఇంట్లో వంటసామానులు ఏమీలేవని విసుక్కుంటుంది యింటియిల్లాలు నెలన్నా కాకముందే ఆఫీసుకువచ్చి సీటుకు ఎదురుగా కూర్చుంటాడు కిరాణా కొట్టువాడు. వీళ్లందరితోను యీ విధంగా సతమత మవుతూ వుంటే మీ ఓటు నాకే వెయ్యమని నిర్బం దిస్తాడు రాజకీయవాది. తీరా ఓటిస్తే సీటెక్కి మనమొరే వినిపించుకోడు. అతనే ఏమిటిలే! అసలు ఆ దేవుడే మన మొర ఆలకించడంలేదు చూడు పద్మా! ఈ భూమి, సూర్యుడు రూపాయలచుట్టూ తిరుగుతున్నాయంటె నమ్మి.

పద్మ:- ఏమోనండీ. మనబ్రతుకుచూడగా ముండ్లకంచెలో పడ్డ పక్షిలాగావుంది. ఈ అప్పులన్నీ తీరతాయని నాకు నమ్మకంలేదు. ఒకటా - రెండా ఊరంతా అప్పులే. ఒక గొయ్యి పూడ్చడానికి మరో గొయ్యి తీస్తున్నాం.

మనచుట్టూ మనం గోతులు త్రవ్వుకున్నాం. ఎప్పుడు యేగోతిలో పడతామో తెలియదు. ఈ అప్పులు చేయ వద్దని మీతో ప్రతిరోజు చెవులో యిల్లుకట్టుకొని వాగు తున్నా, ఏమైనా వినుపించుకుంటేనా! అదేమిటంటే సన్యాసుల్లో కలుస్తావంటారు. వాగి వాగి నానోరు పడి పోతోంది. అప్పుచేసి తిన్నకూడు అరగకముందే అప్పు యిచ్చినవాడు తీర్చమని కూర్చుంటున్నాడు. ఎలాగండీ యిలాఅయితే

రామ్మూర్తి:- పద్మా! అప్పులు చేయడం నాకేమైనా సరదా అనుకున్నావా! చిన్న ఉద్యోగం తక్కువ జీతం. బస్తీలో కాపురం. వచ్చిపోయె చుట్టాలు దానికితోడు పీక్కుతినే పిల్లలు. మరి అప్పులుచేయక ఎలాబ్రతకడం.

పద్మా:- ఈ చాలీచాలని ఉద్యోగం చెయ్యకపోతే ఏదైనా వ్యాపారం పెట్టకూడదూ? మన దరిద్రం తీరిపోతుంది.

రామ్మూర్తి:- ఏం! మళ్లీయుద్ధం ఏమైనా వస్తోందేమిటి? వ్యాపారాలలో లాభాలు గడించటానికి. పూట జరగడమే కష్టంగావుంటే వ్యాపారానికి పెట్టుబడి ఎక్కడతెస్తావ్. అయినా ఈ రోజుల్లో వ్యాపారంలో లాభా లేమున్నాయి. లాభాలు సంగతి ఎలావున్నా ముందు సేల్సుటాక్సు, ఇన్‌కంటాక్సు లెక్కలు చూడలేక చావాలి. ఆదివారం తలుపుతీస్తే లేబరు ఆఫీసరు కేసు పెడతాడు. ఒకటేమిటి అటు పోలీసు కేసులు యిటు మ్యునిసిపాలిటీ కేసులు. ఎందుకొచ్చిన వ్యాపారంగాని నన్నిలా బ్రతకనివ్వు. ఆఁ! నీతో చెప్పడం మరచాను.

నిన్న కమలాపురంనుంచి మా మేనమామ ఉత్తరం వ్రాశాడు.

పద్మ:- ఏమని. డబ్బు పంపుతున్నాననా.

రామ్మూర్తి:- డబ్బా (నవ్వి) మనకు పంపేదెవరు ?

పద్మ:- మరి ఏమనివ్రాశారు ?

రామ్మూర్తి:- రేపు కార్తీక పూర్ణిమినాడు తాను సకుటుంబ సమేతముగా విచ్చేస్తున్నాడట సముద్రస్నానానికి. వడ్డీ వ్యాపారంలో గడించుకొన్న పాపాన్ని రద్దుచేసు కోటానికి. పదిరోజులపాటు వుంటాననికూడా వ్రాశాడు.

పద్మ:- మీరు నాకు భలేవార్తలు చెపుతున్నారండీ. ఈ బస్తీలో మనం బ్రతకడమే కష్టంగావుంటే పైగా చుట్టాలు కూడానా! ఏమండోయ్! ఈ పూట మీ మేనమామ గారికి ఉత్తరం వ్రాయండి

రామ్మూర్తి:- ఏమని ?

పద్మ:- నా భార్యకు పిల్లలకు సుస్తీగా వున్నదని... ఆ దెబ్బతో వాళ్లు మనకు చాకీరీ చేసి పెట్టవలసివస్తుందని రాకుండా మానుతారు.

రామ్మూర్తి: (నవ్వి) ఈ తెలివితేటలు మీ నాన్నకంటే మీ తాత యింతవరకు బ్రతికి వుండేవాడు. మొత్తానికి అనిపిం చావ్. ఆ కామయ్య కూతురవని.

పద్మ:- నాకేమిటండి. తెచ్చిపడేస్తే నేను చేయ్యనన్నానా! మీ మేనమామనుకాదు మీ ముత్తాతనుకూడా రమ్మనమనండి చేసిపెడతాను. మధ్యవచ్చిన దానిని నాకెందుకు ?

రామ్మూర్తి:- సరే! యిలా ఏడుస్తూ కూర్చుంటే అయినట్టే! పిల్లలు ఆకలికిత్తో చస్తారు. ఈపూటకు భత్యం చూచుకోవాలిగామరి. ఆ సంచి యిలా తగులబెట్టు. ఎక్కడైనా అప్పు దొరికితే తీసుకువస్తాను.

పద:- దొరకటానికి ఎవరు పారేసుకుంటారండీ!

రామ్మూర్తి:- నీబోటివాళ్లు నోరన్నా పారేసుకోరూ! (పోబోతాడు)

పద్మ:- ఏమండీ! కాస్త ఆసైకిలు వేసుకెళ్ళండి త్వరగావస్తారు. సైకిలు వుండగా నడిచివెడ్తారేమిటండీ!

రామ్మూర్తి:- సైకిలు అలాగే వుంచని. అది బయటకు తీశామంటే ఎవరో వకరు పట్టుకుంటారు.

పద్మ:- మనసైకిలు ఎవరుపట్టుకుంటారండీ.

రామ్మూర్తి:- లైసెన్సులేదని పగలు మ్యునిసిపాలిటీవాళ్లు పట్టుకుంటారు. లైటులేదని రాత్రిళ్లు పోలీసులు పట్టుకుంటారు కరువులో అధికమాసం. వాళ్లతో ఎవరు పడతారు. అదీగాక టైరుల్లో గాలిలేదు.

పద్మ:- మరి యీపూట ఆఫీసుకి శలవు పెడతారా?

రామ్మూర్తి:- అవును. ఏంచావనూ! శలవు పెడతాను. నా శలవులన్నీ యిలా అవ్వవలసిందేగా.

పద్మ:- ఏమని శలవు పెడతారు?

రామ్మూర్తి:- తల నొప్పిగావుందనో, జ్వరంగావుందనో శలవు పెడతాను.

పద్మ:- అదేమిటండీ లేని రోగాలు తెచ్చుకుంటున్నారు.

రామ్మూర్తి:- లేకపోతే, మా యింట్లోకి బియ్యంలేవు మా ఆవిడకు పువ్వులు తెచ్చిపెట్టాలి అని ఈ చిల్లర మల్లర పనులన్నీ శలవుచీటీలో వ్రాస్తామా! లేని రోగాలు కల్పించి శలవు పెడితేనేగాని మాకు శలవు దొరకదు. అందాకా ఎందుకు మొన్ననాకు జ్వరంవస్తే శలవు దొరికిందా? ఎంతఅవస్థపడ్డాం. ఆ శీతయ్యగాడికి ఏరోగం లేకపోయినా డాక్టరు సర్టిఫికేటు చూపగానే నెలరోజులు సెల విచ్చారు. ఇలాగేవుంటాయి సిబ్బంది యిబ్బందులు.

పద్మ:- మీ సిబ్బంది యిబ్బందులు ఎప్పుడూ వుండేవేగా! ఇదుగో యీ సంచి తీసుకొని త్వరగా బియ్యం కూరలు తీసుకురండి. ఏమండోయ్! పిల్లదానికి పాలడబ్బా తీసుకు రండి. ఏమండోయ్! మిమ్మల్నే! పిలుస్తుంటే అలా వెళ్ళిపోతారేమిటి; పెద్దవాడికి సేమియాలంటే మహా యిష్టం. ఒకసేమియా పొట్లాంకూడా తీసుకురండి. (మరలపిలిచి) ఏమండీ! బట్టలు ఉతకటానికి ఒకసబ్బు కూడా తెచ్చిపెట్టండి.

రామ్మూర్తి:- (లాలనగా) పద్మా! యిలారా! (కోపంతో గట్టిగా) నీకు మల్లెపూలు తీసుకురావక్కర్లా? అయిందా నీ బజారు పట్టిక. ఇంకేమైన మిగిలివున్నాయా; ఒక్క సారేచెప్పు. బజారు బజారంతా తీసుకువచ్చి మనయింట్లో పడేస్తాను.

పద్మ:- ఎందుకండీ అలాకసురుకుంటారు?

రామ్మూర్తి:- లేకపోతే ఏమిటి? ఒక్కనిముషంలో పది రూపా యల ఖర్చుచెప్పావ్. మరి యిన్ని అప్పులు ఎందు

కయ్యాయని అడుగుతావ్. ఇప్పటికైనా తెలిసిందా యిన్ని అప్పులు ఎందుకయ్యాయో! (వెళ్ళిపోతాడు)

పద్మ:- ఖర్మకొద్ది దొరికారు. పెళ్లి సంబంధానికి వచ్చి పిల్లను చూచుకొని మీ అమ్మాయికి పాటలేమైనా వచ్చా. హార్మోనియం వాయిస్తుందా? భరతనాట్యం నేర్చుకుందా? ఇంగ్లీషు బాగా మాట్లాడుతుందా? అని ఇంటర్వ్యూ ఇస్తారు. తీరా పెళ్లైనతరువాత భరత నాట్యాలు సంగీతాలు పోయి ముద్దదొరకడం కష్టమవుతుంది. అప్పుడివన్నీ అడక్కపోతే మీ అమ్మాయికి వడుపొచ్చా ని అడగకూడదూ! ఇటువంటి సంసారాలు చేయలేక ఏడ్వవచ్చు.

(బయటనుంచి బిచ్చగాని కేక)

బిచ్చగాడు:- అమ్మా! గుడ్డివాణ్ణి తల్లి. బిచ్చంపెట్టండమ్మా!

పద్మ:- ఇంట్లోగింజలేదు. నువ్వు బిక్షాటనకొచ్చావ్. మా వారు అప్పుతీసుకు రావడానికి వెళ్ళారు అంతే తేడా. కాళ్ళు చేతులు బాగున్నవాళ్లం మేమే చస్తున్నాం. నీ కెక్కడ నుంచి తీసుకొచ్చిపెట్టేది. ఈరోజుకి వెళ్ళిరా. (నిరాశగా) దేశ పరిస్థితులు ఎన్ని మారిన బిక్షాటన - నిరుద్యోగ సమస్య మాత్రం తీరలేదు. బిక్షగాళ్ల, నిరుద్యోగుల పట్ల ఈ సమాజం ఈసడింపుతో చూడటం అలవాటు పడిపోయింది. ఈ సమస్య పరిష్కారం తీరితేనేగాని లోకం నిత్యకళ్యాణం పచ్చతోరణంగా మారదు. మావారు పేరుకి ఉద్యోగం చేస్తున్నా మేము అనుభవించే బాధ ఇంతంతకాదు. పాపం బిచ్చగాళ్లు- నిరుద్యో

గులు ఇంకెంత అవస్థ పడుతున్నారో. వారిదాకా వస్తేనేగా ఏవిషయమైనా అర్థంఅయ్యేది.

కుర్రవాడు:- (కంగారుగా ప్రవేశించి) అమ్మా! అమ్మా! చెల్లి పాలసీసా పగలకొట్టిందే.

పద్మ:- నువ్వు దాని వీపు పగలగొట్టలేక పోయావ్.

కుర్రవాడు.- నీతో చెప్తానంటేనూ నన్ను కొట్టబోయిందే.

పద్మ:- అందుకని ఏడుపు ముఖంతో నాదగ్గరకు వచ్చావ్రూ.

కుర్రవాడు:- (ముఖం చిన్నబుచ్చుకుంటాడు)

పద్మ:- అదేమిట్రా! అలా వున్నావ్. ఇలా రా!

కుర్రవాడు:- తలనొప్పిగా వుందమ్మా!

పద్మ:- ఏదీ! నన్నుచూడనీ (ముఖంమీద చెయ్యిపెట్టి చూస్తుంది.)

కుర్రవాడు:- వళ్లు వెచ్చగాలేదమ్మా!

పద్మ:- జ్వరంతగిలిందిరా! పాపిష్టిదాన్ని. నిన్ను కొట్టి చచ్చాను. నా చేతులువిరిగిపోనూ.

కుర్రవాడు:- ఎందుకమ్మా అలా అంటావ్.

పద్మ:- ఇప్పుడు నేనేం చేసేది.

కుర్రవాడు:- అదేపోతుందిలేవే అమ్మా! నువ్వూరుకో.

పద్మ:- మీనాన్నగారు వచ్చినతర్వాత డాక్టరుదగ్గరకు పంపించి మందు తెప్పిస్తాలే.

కుర్రవాడు:- నాన్నగారు ఎక్కడకు వెళ్ళారమ్మా?

పద్మ:- ఈపూటకు బియ్యం తీసుకువస్తానని విసుక్కుంటూ నన్ను కసురుకొని బజారువెళ్ళారు.

కుర్రవాడు:- నాకుమందు వద్దులేమ్మా! నాన్నతో చెప్పబోకు. అదేతగ్గిపోతుంది. నాన్నను బాధపెట్టకమ్మా!

పద్మ:- బాబూ... (తలనిమురుతు) అవును బాబు నాన్నని బాధపెడుతున్నాను. ఇకయెవరిని బాధపెట్టను. ఆ బాధ ఏదో నేనేపడతాను.

కుర్రవాడు:- అలా బాధపడతావ్ ఎందుకమ్మా!

పద్మ:- బాధగాకయేముందీ! ఆ స్తిపాస్తులు లేకపోయిన మీనాన్న గారి చేతులే ఆస్థి అనుకున్నాను. రెక్కలు ఆడినా డొక్కలు పూడటంలేదు. ఆ వచ్చే జీతపురాళ్లు పది రోజులపాటు కూడా చాలడంలేదు. మేము పస్తులు పడుతున్నా మీ కడుపులు కూడా నిండటంలేదు.

కుర్రవాడు:- నాన్నగారు బడిజీతం కట్టలేరుగాని నేను బడి మానేస్తానమ్మా! ఏ కొట్లోనైనా జీతానికి వుంటా.

పద్మ:- అవేంమాటలురా! ఇంతున్నావో లేవో! నిన్నెవరు జీతానికి పెట్టుకుంటారు? పెట్టుకున్నా ఏమిస్తారు? నువ్వు సంపాదిస్తేనేగాని మన దరిద్రం తీరదా?

కుర్రవాడు:- అది కాదమ్మా...

పద్మ:- ఏదీకాదు నువ్వు వూరుకో

కుర్రవాడు:- శకుంతల పిన్నిగారి అబ్బాయికి ఆ కొట్లో నెలకి పది రూపాయలు యిస్తున్నారుటమ్మా!

పద్మ:- ఇస్తే... నువ్వుకూడా ఆ కొట్లో పని చేస్తావా? యిప్పుడు కాదునాయనా నీకు మామీద ప్రేమ. చక్కగా చదువుకుని పెద్దవాడవై ఉద్యోగం చేస్తున్నప్పుడు మాకు సంపాదించి పెడుదువుగాని.

కుర్రవాడు:- అప్పుడు నేను ఆఫీసులో పనిచేసి బోలెడు రుపీసులు తెస్తానమ్మా! అన్ని నీకే యిచ్చేస్తా!

పద్మ: ఊం... సరేగాని. బాబూ... నేనొక మాటడుగుతా చెప్తావు.

కుర్రవాడు:- ఏమిటమ్మా!

పద్మ:- రేపు నీకు పెళ్లైనతరువాత నీ భార్యమాటలు విని మమ్మలను వెళ్ళగొట్టకుండా ఆదరిస్తావటారి!

కుర్రవాడు:- అసలు నేను పెళ్లేచేసుకోనుగా.

పద్మ:- ఎందుకనిరా!

కుర్రవాడు:- నాకు సిగ్గేస్తోందమ్మా!

పద్మ:- మగవాడివి నీకు సిగ్గేమిటారి (నవ్వుకుంటుంది)

కుర్రవాడు:- ఎందుకేమిటి అలా నవ్వుతావు?

పద్మ:- నవ్వనుగాని ఆ పుస్తకాలు తెచ్చుకొని పాఠాలు చదువుకో

కుర్రవాడు:- ఏం పుస్తకాలు

పద్మ:- అదే నీ వాచకపుస్తకం

కుర్రవాడు:- అది కొనలేదుగా. నాన్న జీతంరాగానే కొనిపెడతా నన్నాడు. రోజు పంతులుగారు కేకలేస్తున్నారమ్మా!

పద:- లేని పుస్తకాల మాటెందుకు వున్నపుస్తకాలు చదువు.

కుర్రవాడు:- (లోపలకువెళ్ళి పుస్తకాలు తెచ్చుకుంటాడు)

పద్మ:- పాపకు పాలుపట్టి వస్తాగాని చదువుకుంటూ కూర్చో. (లోపలికి వెళ్తుంది.)

కుర్రవాడు:- (చదువుకుంటూ కూర్చుంటాడు)

(సంతోషంతో ఆదుర్దాగా రామ్మూర్తి ప్రవేశం)

రామ్మూర్తి:- పద్మా! పద్మా! నీ అమ్మ ఏదిరా!

కుర్రవాడు:- పిలుస్తానుండు (లోపలకు వెళ్తాడు)

పద్మ:- (ప్రవేశిస్తుంది)

రామ్మూర్తి:- పద్మా! మన అదృష్టం పండింది. వీధిలోకి వెళ్లానో లేదో మా స్నేహితుడొకడు కన్పించాడు. ఇబ్బందిగా వుందని పాతిక రూపాయలు అప్పు అడిగాను. నెలకు కాస్తచొప్పున యిచ్చి తీర్చుకోరా అని డబ్బు యిచ్చాడు. ప్రస్తుతానికి మన చిక్కులన్నీ తీరి పోయాయిపో. అబ్బాయికి జీతాలు - అమ్మాయికి బట్టలు - చిల్లర మల్లర అప్పులు - చుట్టాలకు ఆతిథ్యం - ఓ...అధికంగా చేయొచ్చు

పద్మ:- కాలం మనకు కలిసివచ్చింది. ఎంత మంచివారండీ మీరు ఏది ఆడబ్బు.

రామ్మూర్తి:- (జేబులో చెయ్యిపెట్టి తడుముకుంటాడు కంగారుగా) అరెరే జేబుకి చిల్లివుంది. ఎవడో దొంగవెధవ కత్తిరికి పనిచెప్పాడు. ఏమిటీ దురదృష్టం. డబ్బుపోయింది. నాఖర్మం కాలింది. ఎట్లా, పోయినడబ్బు ఎక్కడ దొరుకుతుంది ఎవడు కొట్టేశాడో?

పద్మ:- దరిద్రుడు ఏరేవుకి పోయినా ముళ్లపరిగేనట. లేకపోతే మీకు డబ్బు అప్పుదొరకడం ఏమిటి? అది పోవడం ఏమిటి. అయినా మిమ్మలననే పనిలేదు. ఇదంతా నాఖర్మ. ఇంత అజాగ్రత మనుష్యులు ఆఫీసులో పంపని చేస్తున్నారండీ

రామ్మూర్తి:- అజాగ్రత్తగా చేయాల్సిన పనులేమన్నా వుంటే అవి నాకే వప్పజెబుతారు.

పద్మ:- అది మీకు మామూలేగా డబ్బు అప్పు దొరకగానే బియ్యం కూరలు తేగూడదూ! ఏమంత కొంపమునిగిపోయిందని వీధులవెంట తిరగాలి.

రామ్మూర్తి:- అసలు మొన్న ఏం జరిగిందో తెలుసా?

పద్మ:- అబ్బా మొన్నటి సంగతెందుకండీ! ఇవ్వాల్టిటి సంగతేమిటో చూడండి బాబు మీకు పుణ్యంవుంటుంది.

రామ్మూర్తి:- అవును. ఈ పూటకు బియ్యం లేవుకదూ! ఏంచేద్దాం. ఈపూటకు ఎక్కడైనా అప్పుతీసుకు వస్తావా?

పద్మ:- తెచ్చినవి యిచ్చామునుకనా!

రామ్మూర్తి:- అవును. నిజంకూడా అంతే. ఇప్పుడేంచేద్దాం.

పద్మ:- ఏమిటండీ అంతే. ఏముందీ చేయడానికి నా కెదురుగా మీరు మీ కెదురుగా నేను కూర్చుందాం. మనయిద్దరు ముఖాలు చూస్తూ పిల్లలు మనముందు కూర్చుంటారు. లేకపోతేనట డబ్బు పారేసుకొచ్చారట డబ్బు. డబ్బు పోయిందని కొంచెమైనా విచారం వుందేమో ఆ మనిషికి. అదేమిటండీ అంటే సన్యాసుల్లో కలుస్తానంటారు.

రామ్మూర్తి:- నువ్వు మాత్రం మాట్లాడితే పుట్టింటికి పోతాననవు.

పద్మ:- నిజంగానే పుట్టింటికిపోయినా బాగుండేది. ఈ బాధలన్నా తీరేవి.

రామ్మూర్తి:- నిజంగానే సన్యాసుల్లో కలిస్తే పోయేది. ఈ బాధలు లేకుండా పోయేవి.

పద్మ:- నాదగ్గరే మీ మాటలు. నిజంగా మీరు సన్యాసుల్లో కలుస్తారూ ?

రామ్మూర్తి:- నాదగ్గరే నీ బెదరింపులు. నిజంగాచెప్పూ. నువ్వు పుట్టింటికి పోతా?

పద్మ:- కడుపు నిండని కబుర్లకేమొచ్చెగాని యీపూటకు బియ్యం సంగతి చూడండి

రామ్మూర్తి:- నేనేం చావమంటావ్ చెప్పు అందినచోటల్లా అప్పు చేశాను. కనుచూపు మేరలో నాకిచ్చేవారులేరు. నా మాటవిని ఎక్కడోచోట నువ్వో తిప్పలుపడు.

పద్మ:- పడే తిప్పలుచాలు. ఇంక ఎక్కడో పడటం ఎందుకు; మీ పేరు చెప్పుకుని పిల్లలు నేను యీపూట పస్తుపడి వుంటాం.

రామ్మూర్తి:- ఏడవబోకు. నీ ఏడుపే కొంపతీస్తోంది. ఎక్కడకైనాపోయి తెస్తాలే.

(బయటనుంచి స్నేహితుని కేక వినబడుతుంది)

శివరాం:- రామ్మూర్తీ ! రామ్మూర్తీ !

రామ్మూర్తి:- పద్మా! మా స్నేహితులు ఎవరో వచ్చినట్లున్నారు, నువ్వు లోపలికివెళ్లు. ఊఁ... త్వరగావెళ్లు. అబ్బా వెళ్ళమంటుంటే. (తలుపుతీస్తాడు) ఏరా! బ్రదర్! ఏమిటిటి ఇలావచ్చావ్ రా! కూర్చో.

శివరాం:- అదృష్టవంతుడివి, నీదర్శనం చేసుకుందామని.

రామ్మూర్తి:- ఎప్పటికిరా బ్రదర్ నేను అదృష్టవంతుణ్ణి అయ్యేది. నేను అదృష్టవంతుణ్ణి అయ్యేదాకా కొంచెం ఈ దురదృష్టవంతుడుకి దూరంగా కూర్చోరా. నా దురదృష్టం

నీమీద జారిపడుతుందేమో!, సంసారమనే యీ భయంకర రాక్షసితో అనుదినం యుద్ధంచేసి, ఎలాగో పరువుగా కాలం గడుపుతూ వుంటే దారిద్ర్యం అనే మరో రాక్షసికూడా కళ్ళెదుటకువచ్చి నాట్యంచేస్తూ, తన భయంకర ఉక్కుహస్తాలను మా సంసారముపైకి చాచి మమ్ములను అణగద్రొక్కుతోంది.

శివరాం:- ఎందుకురా అంత నిరాశగా మాట్లాడుతావ్? నిరాశతో నీవు సాధించేదేమిటి? ఆత్మ విశ్వాసంతో ముందుకు పోతేనేగాని జీవితం విజయం సాధించదు. నీకు తెలియనిది మాత్రం ఏముందీ?

రామ్మూర్తి:- తెలిసి మాత్రం చేసేదేముందిరా! చాలీ చాలని జీతంతో సతమత మవుతున్నానంటే నమ్ము-

శివరాం:- ఇటువంటి ఇబ్బందులు పడేది నీ వొక్కడివే కాదు. మనబోటి ఉద్యోగులంతా పడుతున్న బాధలే యివి. అటు నరకం కాకుండా, యిటు స్వర్గం కాకుండా మధ్యలో త్రిశంకు స్వర్గాన్ని అనుభవిస్తున్నారు. అయినప్పటికీ అందరూ నీలాగా నిరుత్సాహ పడుతున్నారా?

రామ్మూర్తి:- నీకేంరా! మహారాజువి. రెండువిధాల సంపాదన.

శివరాం:- (నవ్వి) అంతా నీలాగ వుంటారట్రా! నా భార్యను ట్రైనింగు చదివించాను గనుకనే టీచరు చేస్తూ ఆవిడ కూడా సంపాయిస్తోంది. అందుకే ఏ యిబ్బంది లేకుండా మా జీవితాలు హాయిగా సాగిపోతున్నాయి. నీవు కూడా నీ భార్యను ట్రైనింగు చదివించి టీచరు పని చేయించు. మీ కాపురం కూడా చక్కబడుతుంది.

ఇదుగోరా భాయ్! నేను చెప్పుతున్నా విను. సంసార భారాన్ని సమానంగా పంచుకున్నట్లే సమాజములో స్త్రీకి కూడా సమాన స్థానం ఉందని గుర్తించి స్త్రీ చేత కూడా ఉద్యోగం చేయిస్తే యిక ఆ దంపతులు పొందేది స్వర్గమేరా!

రామ్మూర్తి:- ఆ భాగ్యం అందరికీ లభిస్తుందట్రా! నీవేదో అదృష్టవంతుడివి కాబట్టి నీకు సంపాయించిపెట్టే భార్య లభించింది.

శివరాం:- అదేపొరపాటు. అవకాశమనేది అందరికీ లభిస్తుంది. కాని అదృష్టవంతుడు అదృష్టాన్ని గుర్తించి అందుకో గలుగుతున్నాడు. దురదృష్టవంతుడు కలసివచ్చిన అవ కాశాన్ని కాలదన్ని నీలాగా యిబ్బందులు పడు తుంటాడు.

రామ్మూర్తి:- అయితే నన్నిప్పుడు ఏం చెయ్యమన్నావురా?

శివరాం.- చేసేందుకేముందీ? నీభార్యచేత ట్రైనింగు చదివించి టీచరు చేయించు. లేకపోతే మహాత్ముడు ఆదేశించినట్లు రాట్నం వడికించు. తెలివి తేటలుండాలికాని గృహ పరిశ్రమ లేమన్నా చేయించవచ్చు. ఆ వచ్చే ఆదా యంతో పొదుపుగా జీవించవచ్చు.

రామ్మూర్తి:- పేపరు చదవటం చేతకాని నా భార్యచేత ట్రైనింగు ఏమని చదివించేదిరా!

శివరాం:- ప్రైవేటుగా చదవాలని ఎక్కడుంది? దొడ్లో కూర గాయలు పెట్టించు. పాడి పశువులనుకొని పాడి చేయించు. అందులోనే ఆదాయం ఎక్కువుంది. మీరు తిని యింకొకరికి పెట్టొచ్చు.

రామ్మూర్తి:- నాకు మంచి జ్ఞానోపదేశం చేశావురా! తీరిక సమయాల్లో గృహపరిశ్రమ ఏదైనా నెలకొల్పుతాను. అప్పటికైనా నా దరిద్రం తీరుతుందేమో!

శివరాం:- ఇప్పటికే కొంత తీరిందిరా!

రామ్మూర్తి:- ఏమిట్రోయ్ విశేషం?

శివరాం:- మాటల్లోపడి వచ్చిన సంగతే మరచిపోయాను. ఈ నెలనుంచి మన జీతాలు పెంచుతారట. సంవత్సరానికి రెండు నెలల బోనసుకూడా యిస్తామని అధికారులు ఆదేశించారు.

రామ్మూర్తి:- నిజంగానేరా!

శివరాం:- అబద్ధం ఆడటం మనకలవాటు లేదురోయ్. ఈ శుభ వార్త నీతో చెప్పి పోదామనే వచ్చాను. ఇంతకూ ఈ పూట శలవు ఎందుకు పెట్టినట్లు?

రామ్మూర్తి:- ఏం చెయ్యమన్నావురా? సంసారాన్ని సర్దుకో లేక చస్తున్నానంటే నమ్ము! ప్రొద్దున్నే మనవాడి దగ్గర పాతిక రూపాయలు అప్పు తీసుకుంటే ఎవడో జేబుదొంగ కొట్టేశాడు.

శివరాం:- అంత అజాగ్రత్తగా ఎందుకున్నావురా? ఇవిగో ఈ పది రూపాయలు నీదగ్గరుంచు ఈ నెలాఖరుకి ఇద్దుగాని.

రామ్మూర్తి:- అక్కర్లేదురా!

శివరాం:- పగవాలేదులే ఉంచుకో.

రామ్మూర్తి:- నా భార్యతో వేగలేకుండా వున్నానురా!

శివరాం:- నీభార్య మంచిదన్నావు ఒకప్పుడు.

రామ్మూర్తి:- నా భార్య చెడ్డదని ఏ మగవాడు చెప్పుకుంటాడురా? (నవ్వుకుంటారు)

శివరాం:- గుడ్ బై. నేను వెళ్ళొస్తా

రామ్మూర్తి:- గుడ్ బై. పద్మా! పద్మా! త్వరగా రా!

పద్మ:- వస్తున్నానండీ, మీరు కోపంవచ్చిన ఆపుకోలేరు. సంతోషమువచ్చినా పట్టలేరు. ఏమిటి హడావుడిగా కేకలేస్తున్నారు.

రామ్మూర్తి:- ఇప్పుడొచ్చిన స్నేహితుడు ఈ నెల మాకు కొత్తగా పెంచినజీతాలు యిస్తారనీ- గృహోపకరణములు ఏదైనా కెలకొల్పమని చెప్పాడు.

పద్మ:- ఆఁ! అన్నీవింటూనే వున్నా,

రామ్మూర్తి:- అన్నీ వింటూనేవున్నా? సరేలే! ఇంకా నీకు చెప్పేదేముందీ?

పద్మ:- ఆయనగారి భార్యలాగా నన్నూ ఉద్యోగంచేసి ఊళ్లు ఏలమని చెప్పండి. చేస్తాను.

రామ్మూర్తి:. ఏడ్చావ్! పేపరు చదవటం చేతకాదు. ఇంకా ఉద్యోగం ఏం వెలగబెడతావ్.

పద్మ:- అన్నాగూ? మీరు ఆమాట అంటారని నాకు తెలుసు. అందుకనే మీ ఎదుట పేపరు చదవను.

రామ్మూర్తి:- నేను లేనప్పుడు చదువుచున్నావేమిటి?

పద్మ:- మీరు ఆఫీసుకు వెళ్ళినతరువాత మంగమ్మగారి యింటికి వెళ్ళి డిటెక్టివ్ నవలలు తెచ్చుకొని చదివి మీరురాక ముందే వారికి యిచ్చేస్తూ వుంటాను.

రామ్మూర్తి:- అఘోరించకపోయావ్! డిటెక్టివ్‌లు చదువు తోందట. డిటెక్టివ్‌లు. రోజు పత్రికలు తెస్తాను అవి చదువు. ప్రపంచ పరిస్థితులు తెలుసుకో. ఇంకా తీరిక సమయాల్లో రాట్నం వడకు. దొడ్లో పాదులుపెట్టి రోజు నీళ్లుపొయ్యి. కూరలన్నా కాస్తాయి. ఇంటిఖర్చు కొంత తగ్గుతుంది. ఇంకా నీకు ఓపిక తీరిక వుంటే ఒక ఆవును కొంటాను, పాడిచెయ్యి, పాలు, వెన్న, పెరుగు అమ్మి. పై ఖర్చుకువస్తుంది. దేనికైనా తెలివి వుండాలే దద్దమ్మా!

పద్మ:- ఈ తెలివి మీకు యెప్పుడునుంచి పుట్టిందండీ!

రామ్మూర్తి:- ఇప్పుడొచ్చిన నా మిత్రుడు నాకు జ్ఞానోపదేశం చేసినప్పటినుంచి, ఈ విషయాలు తప్పక అమలుజరిపి మన దారిద్ర్యానికి స్వస్తి చెప్పవలసిందే.

పద్మ:- నేనుమాత్రం కాదన్నానా ఏమిటండీ! అసలు మిమ్మల్ని ఒక కుట్టుమిషను కొనమని ఎప్పుడో చెప్పుదామను కున్నా. మీరు ఎక్కడ చివాట్లు పెట్టి చీపురుకట్టతో కొడతారోనని ఆ పరిసక్తి మీదగ్గరకు తెలేకపోయాను.

రామ్మూర్తి:- ఇక నీ తెలివితేటలు చూస్తాగా! ఈ దెబ్బతో మన సంసారం రాంణిపో, క్షీణింపో, తేలిపోవాలి. ఆ సంచి యిలాయివ్వు ఈ పూటకు బియ్యంతీసుకువస్తా.

పద్మ:- డబ్బు ఎక్కడిదండీ!

రామ్మూర్తి:- ఇందాక వచ్చిన స్నేహితుడు పదిరూపాయలు అప్పుగా యిచ్చాడు.

పద్మ:- మళ్ళీ ఆ పదిరూపాయలు కూడా పారవేసుకువస్తారా ఏమిటండీ! ఖర్మం. ఆ చొక్కా విడిచి మరో చొక్కా వేసుకువెళ్ళండి.

రామ్మూర్తి:- ఒక జేబుకేగా చిల్లివుంది. బాగున్న జేబులో భద్రపరచాలే!

పద్మ:- మీరు అసలే మతిమరుపు మనుష్యులు. ఆ కొత్తచొక్కా వేసుకువెళ్ళండి మీకు పుణ్యంవుంటుంది.

రామ్మూర్తి:- రేపు యిచ్చే కొత్తజీతాలనాడు ఆ కొత్తచొక్కా వేసుకెడతాలే. ఆ కొత్తజీతాలు వచ్చాయంటే యిక చూడు పద్మా! మనకష్టాలన్నీ గట్టెక్కినట్లే.

పద్మ:- ఏమండీ! ఒక్కమాట. ఇన్నాళ్ళనుంచి పడవలసిన కష్టాలన్నీ పడ్డాం మీ అధికారులు సిబ్బంది యిబ్బందులను గ్రహించి జీతాలు పెంచారు. ఇకనైనా అప్పులు చెయ్యడం మాని జాగ్రత్తపడటం అవసరం పిల్లల గలవాళ్ళం. ఏరోజుకు ఏయిబ్బందివస్తుందో మనం చెప్పలేము. నా మాటవిని కొంచెం పొదుపుగా వుండటం అవసరం. కాళ్లు చేతులు బాగుండి వయస్సులో వున్నప్పుడు సంపాదించి కూడబెట్టుకుంటే మన వృద్ధాప్యంలో సుఖపడతాము.

రామ్మూర్తి:- అవును పద్మా! పడిన కష్టాలు చాలు. కావాలని కష్టాలను కౌగలించుకుంటామా! దేశకాల పరిస్థితులను గుర్తెరిగి ప్రవర్తిస్తాను. ఇన్నాళ్లూ నరకం అనుభవించిన స్థానే యిప్పుడు స్వర్గాన్ని అనుభవిద్దాం. గడ్డురోజులు పోయి మనకు మంచిరోజులు దాపురించాయి. వెళ్ళి సంచి తీసుకురా,

పద్మ:- (సంచి తీసుకువచ్చి యిస్తూ) ఏమండీ! బియ్యం కూరలు తీసుకురండి. పెద్దవాడికి సేమియా పాయసం అంటే యిష్టం సేమియాలు పొట్లాంకూడా తీసుకురండీ!

రామ్మూర్తి:- నీకు మల్లిపూలు కూడా తెస్తానుగా.

పద్మ:- (నవ్వుకుంటూ) భలేవారండీ!

రామ్మూర్తి:- భగవంతుడా! బ్రతుకులో ఒకసారి భార్య! 'భలే' అంటే అదే స్వర్గం.

(ఇద్దరూ నవ్వుకుంటారు)

—తెర పడుతుంది—

సమాప్తి.



# విధివిలాసం

## నవల

### రచన: విడియాల చంద్రశేఖరరావు

అనేక సందేశాలు ఈ నవలనిండా కానవస్తావి రచయిత మంచి సంఘ సంస్కరణాభిలాషి. తన మనోభావములను, ఆశయాలను పాత్రలద్వారా ప్రకటించారు. ఇందు భావములు, భాష ఒకదానికొకటి పందెం వేసుకొని పరుగులు తీశాయి ఈ నవల చదువుచున్నంతసేపు విసుగు జనించకపోగా అద్యంతమూ చదువనిదే విడువ బుద్ధిపుట్టనంత గొప్పగా సృష్టించారు. సంఘములో జరుగుచున్న అన్యాయాలను, కళ్ళకు కట్టినట్లుగా చూపించారు. స్త్రీ జాతి జీవితపు లోతుల్లోకి తొంగిచూచి రసానుభూతిని చొప్పించారు. ఇందులో ముఖ్యముగా స్త్రీల కుపకరించు సందేశాలు యెన్నియో గలవు.

—ఆంధ్రపత్రిక

సంఘంలో జరుగుతున్న అక్రమాలను, దౌర్జన్యాలను చిత్రించడానికి ఉద్దేశింపబడిన నవలలో యిది ఒకటి. స్త్రీల అమాయక హృదయాలను కొందరు దుస్స్వభావులైన పురుషులు ఏ విధంగా అపహరించి వారి జీవితాలను నాశనం చేసేదీ ఈ నవలలో చిత్రించబడినది. ఇందలి పాత్రలన్నీ పఠితల సానుభూతిని చూరగొంటవి. రచనా విధానం బాగుంది

—ఆంధ్రప్రభ

కరుణరస భరితమయిన ఈ నవలను రచయిత చెప్పుకో తగ్గంత నేర్పుతో పాఠకులకు అందించారు

—కృష్ణాపత్రిక

ఈ నాటి సంఘంలో ఆడమనిషి తన జీవితానికి సంబంధించిన భీషణ సమస్యల్ని; ఎలా ఎదుర్కోవలసి వుంటుందో ఈ నవల మనకు వివరిస్తుంది. పాత్రలకు రూపురేఖల్ని యివ్వడంలో రచయిత తన సృజనాత్మక శక్తిని చక్కగా చూపెట్టారు. ఇందలి పాత్రలన్నీ సంఘంలో మనకు అనుక్షణం కనపడే జీవులకు ప్రతిబింబాలు. ఈ రచయిత అన్ని విధాలా అభినందనీయులు. నవల ఆకృతి ఆకర్షణీయంగా ఉంది.

—సినిమా

---

TRISANKU SWARGAM
'VIDIYALA'

A KAVITA PUBLICATION
Re. 0-75



రచయిత:

# శ్రీ విడియాల చంద్రశేఖరరావు

జనన స్థానం : డోకిపర్రు, కృష్ణా జిల్లా

జననం : 1930

విద్యాభ్యాసం : తెనాలి, బందరు

గుణగణాలు : మంచి, మర్యాదా

ఆశయాలు : సమాజంలో జరిగే అన్యాయాలను, అక్రమాలను నవలలు, కథలు, నాటికలు, నాటకాలుగా చిత్రించడం.

యితర రచనలు : నవలలు : మదోన్మాదులు, చంద్రిక, మరపురానిమెరుపు. నాటికలు : త్రిశంకు స్వర్గం, వదిన నాటకం : తారుమారు.